# ఆంధ్రపత్రిక



3/73923
The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 19 WEDNESDAY 20th APRIL 1949 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao

# కామన్వెల్తు ప్రధానమంత్రుల సభలో పాల్గొనడానికి పండిట్ నెహ్రూ లండన్ ప్రయాణం

## ఢిల్లీ విమానాశ్రయంవద్ద రాజగోపాలాచారి, పటేల్ ప్రభృతుల వీడ్కోలు

### లండన్ సమావేశంలో భారతదేశ సమస్యకే ఎక్కువ ప్రాధాన్యత: కామన్వెల్తురూపే మారిపోగలదని సూచన

#### భారతదేశంపట్ల ఐర్ ప్రధాని సానుభూతి

డబ్లిన్, ఏప్రెల్ 18: పత్రికా విలేఖరుల గోష్ఠిలో "రిపబ్లిక్‌గా పెంపొందాలని వాంఛించుచున్న భారతదేశపు కాంక్షపట్ల మీకు సానుభూతివున్నదా?" అని ప్రశ్నించగా, ఐర్ రిపబ్లిక్ ప్రధాని జాన్ కాస్టెల్లో "తప్పకుండా" అని సమాధానమిచ్చారు. "నూతన స్వాతంత్ర్య తేజంతో భారతదేశం ఉజ్వలంగా ముందుకు సాగిపోవాలని అభిలషించుచున్నాను" అన్నారు.

న్యూఢిల్లీ, ఏప్రిలు 19: నేటి ఉదయం 7-45 గంటలకు భారత ప్రధాని పండిట్ జవహర్లాలు నెహ్రూ కామన్వెల్తు సమావేశంలో పాల్గొనడానికి పోతూ విల్లింగ్డను విమానకేంద్రంనుండి బొంబాయికి బయలుదేరారు. ఆయనవెంట విదేశాంగశాఖ ప్రధాన కార్యదర్శి సర్ గిరిజాశంకర బాజపేయి, నెహ్రూ కార్యదర్శి ఎమ్. ఓ. మత్తయి గార్లుకూడా బయలుదేరారు.

నెహ్రూ ప్రధానిని సాగనంపడానికి విమానకేంద్రంవద్దకు గవర్నరు జనరలు రాజగోపాలాచారి, ఉపప్రధాని సర్దారు పటేలు, డా॥ రాజేంద్రప్రసాదు, భారత సర్వసేనాని కరియప్ప, బ్రిటను హైకమీషనరు మొదలుగాగల విదేశ ప్రతినిధులూ, రాజకుమారీ అమృతకౌరు, గోపాలస్వామి అయ్యంగారు, కే. సి. నియోగీ, శ్యామప్రసాద ముఖర్జీ, జగజీవనరామ్, సర్దారు బలదేవసింగు, డా॥ అంబేద్కరు మొదలైన కాబినెటు మంత్రులు వచ్చారు.

#### బొంబాయికి రాక

బొంబాయి, ఏప్రిల్ 19: లండనులో జరుగనున్న కామన్వెల్తు సమావేశమునకు హాజరగుటకై వెళ్లుచున్న భారతప్రధాని పండిట్ జవహర్లాల్ నెహ్రూ నేటి మధ్యాహ్నము ప్రత్యేక విమానములో ఇచ్చటకు వచ్చెను. ఆయనవెంట విదేశాంగ శాఖ ప్రధానకార్యదర్శి సర్ గిరిజా శంకర బాజ్పాయ్, నెహ్రూ స్వంత పరివారము ఉండిరి. శాంటాక్రుజ్ విమానాశ్రయంవద్ద బి. జి. ఖేర్, మురార్జీ దేశాయి, బొంబాయిరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు ఎస్. కె. పాటిల్, బొంబాయి మేయరు, షెరీఫు ఆయనకు స్వాగతమిచ్చిరి. ఆయన విమానమునుండి క్రిందకు దిగుచుండగా పెద్ద జన సమూహము హర్షనినాదము లొనర్చెను. పండిట్‌జీ వారికి ముకుళితహస్తుడై ప్రతి నమస్కారమొనర్చెను.

నేడు ప్రభుత్వ భవనములో గవర్నరు అతిథిగా గడిపి నేటి రాత్రి 11-45 కి ఎయిర్ ఇండియా వారి విమానములో లండను బయలుదేరును.

కామన్వెల్తు సమావేశంలో పాల్గొంటున్న కెనడా విదేశాంగమంత్రి నెస్టర్

2వ పేజి చూడుము

## "ఇటలీ వెనుకటి వలసల నన్నింటినీ సమితి ధర్మకర్తృత్వంకింద ఉంచాలి"

### రాజకీయ సంఘంలో ఇండియా, పాకిస్థాన్ ప్రతినిధుల ప్రతిపాదనలు

లేక్‌సక్సెస్, ఏప్రిల్ 18: ఒక్క తూర్పు ఎరిట్రియా తప్ప మిగతా ఇటాలియన్ పూర్వపు వలసలనన్నిటిని సరాసరి ఐ. రా. ధర్మకర్తృత్వమునకే అప్పగించుట యుక్తమని ఇండియా నేడు రాజకీయ సంఘంలో అష్టసూత్ర పథకము నొకదానిని ప్రతిపాదించెను.

అగ్రరాజ్యములను వేటినీ చేర్చకుండా, నిష్పాక్షికంగా, వలస ప్రజలను సత్వర స్వాతంత్ర్యమునకు అర్హులనుగా తయారు చేయుటయే లక్ష్యంగా గల అంతర్జాతీయ రాజ్య పరిపాలనను వలసలన్నిటిలోను నెలకొల్పవలెనని భారత ముఖ్య ప్రతినిధి ఎమ్. సి. సెటల్వాడ్ సభ్యులకు సూచించెను.

"ఎరిట్రియాలోని తూర్పుప్రాంతము తో ఎబిసీనియాలకు అనేక విషయములలో సన్నిహిత సంబంధముండుటచే, ఆ ప్రాంతము తనకు రావలెనని ఎబిసీనియా ఒత్తిడిచేసే కోరిక సమంజసమేనని ఇండియా భావించుచున్నది. కనుక మస్సావా, అస్సాబ్ రేవులలో సహా తూర్పు ఎరిట్రియాలో జనవాక్య నిర్ణయము జరిపి, ప్రజాభీష్టమునకు ఏర్పాటు చేయవలెను.

ఇక, మిగతా వలసలను సరాసరి సమితి ధర్మకర్తృత్వము క్రిందనుంచుటచే సరిపోదు. ఎందువలన ప్రజలకున్న కోరిక

(2-వ పేజి చూడుము)

## పోలీసు కష్టడీలో మరణం

నెల్లూరు, ఏప్రిల్ 19: అల్లూరు పోలీసువారు ఇసకపల్లిలో అరెస్టుచేసిన పోలయ్య అనునతడు, పోలీసుకస్టడీలో మరణించినట్లు వార్తవచ్చింది. ఈవార్త పలు విధాలుగా తెలియవచ్చినందున జిల్లా మేజస్ట్రేటు, డి. ఎస్. పి. అల్లూరువెళ్ళరు. మరణం ఏట్టిపరిస్థితులలో తటస్థించిందో విచారణ జరిపించవలసిందని కావలి సబ్ డివిజనల్ మేజస్ట్రేటుకు వారు ఉత్తరువు చేశారు. (స్వ. వి.)

## మాజీ ప్రధాని భార్గవాతో తూర్పు పంజాబు మంత్రివర్గ పునర్నిర్మాణం

### భీమసేనసచార్ అంగీకారం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 19: డా॥ గోపీచంద్ భార్గవాగారి వర్గమునుంచి తూ. పంజాబు ప్రభుత్వంలోకి భార్గవగారిని సర్దార్ సచ్చనసింగ్ బజ్వాగారిని మంత్రులుగా చేర్చుకోవలెనని కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు నేడు తూర్పుపంజాబు ప్రధాని లాలా భీమసేన్ సచార్‌గారికి ఉత్తర్వుచేసింది.

లాలా భీమసేన్, డా॥ భార్గవా గారలు ఇవాళ ప్రొద్దున విడివిడిగా సమర్పించిన రెండు జాబితాలలోనుంచి పార్లమెంటరీ బోర్డు ఈ రెండు పేర్లను ఎంచుకొన్నది. భార్గవాగారు మంత్రిగా రానున్నందుకు సంతోషం వెలిబుచ్చుతూ సచార్‌గారు

ఇట్లు నుడివిరి: "గోపీచంద్ భార్గవాగారే ప్రభుత్వంలో చేరనందువలన ఇక ఈ రెండు వర్గాలమధ్య అభిప్రాయభేదములు సమసిపోయి రెండూ ఒకటి కాగలవు. రాష్ట్రములో పరిపాలనను సవ్యంగా నిర్వహించడానికి అనువైన వాతావరణం ఏర్పడగలదు."

సర్దార్ పటేలుగారు ఢిల్లీలో ఉన్న తూర్పు పంజాబు కాంగ్రెసుపార్టీ సభ్యులను తన నివాసంలో సమావేశపరచి ఏకత బోధ చేయగలరని తెలియుచున్నది.

డాక్టర్ భార్గవా నేటి అపరాహ్ణం లాలాభీమసేన్‌సచార్‌ను కలుసుకున్నారు.

## కృష్ణాలో కమ్యూనిస్టు దుశ్చర్యలు

### ఏడాదిలో 20 మంది కాంగ్రెస్‌వాదుల హత్య

1948 ఫిబ్రవరినుండి 1949 జనవరి ఆఖరువరకు ఏడాదిలో కృష్ణాజిల్లాలో 18 గురు కాంగ్రెసువారిని, మలబారులో ఒక కాంగ్రెసువాడిని కమ్యూనిస్టులు హత్య గావించిరి. ఇదికాక, కృష్ణాజిల్లా కాంగ్రెసువాదులగు మరో ఏడుగురిని హైదరాబాదు రాజ్యంలోనికి తీసుకపోయి చంపియుందురని ఎంచబడుచున్నది. ఇతర జిల్లాలలో యిట్లు జరిగినట్లు లేదు. హైదరాబాదు అధికారులతో కలసి ప్రభుత్వంవారు పోలీసు కాపలా యెక్కువచేసి, కమ్యూనిస్టు దుండగములకు పేర్వడిన కృష్ణాజిల్లా గ్రామాలపై దాడులు సల్పుచున్నారు, అని మంగళవారము అసెంబ్లీ సమావేశమున వేదరత్నం పిళ్లెగారి ప్రశ్నకు సభా నాయకుడు సమాధాన మిచ్చిరి.

## గుంటూరుజిల్లా కాంగ్రెస్‌సంఘాన్ని రద్దుచేస్తూ రాష్ట్రపతి ఉత్తరువు

### తొలగింపబడిన సభ్యులకు తిరిగి సభ్యత్వం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 19: గుంటూరుజిల్లా, తాలూకా, పట్టణ కాంగ్రెస్ సంఘములలో సభ్యులుగా వుండి, 1948 జులైలో కార్యదర్శిచే, ఆ పదవులలో వుండ ననర్హులుగా నిర్ణయించబడిన వారికందరికీ రాష్ట్రపతి పట్టాభిసీతారామయ్య పంతులుగారు తిరిగి ఆ పదవులు ఒసగారు.

ఈ నిర్ణయమును వెల్లడించుచు కాంగ్రెస్ కార్యదర్శి కళా వెంకట్రావుగారీదినప్రకటన చేశారు: 1948 జులై 31-న గుంటూరు జిల్లా కాంగ్రెస్ కార్యవర్గ ఎన్నికలు జరుగుటకుముందు, 25 గురు సభ్యులు సభ్యత్వ ప్రమాణపత్రాలపై, గడువులోగా సంతకాలు పెట్టలేదన్న కారణాన కార్యదర్శివారు సభ్యులుగాఉండ ననర్హులని నిర్ణయించారు. 1947-48 ప్రాథమిక సభ్యుల జాబితాలు పేర్లులేని కారణాన మరికొందరిని తొలగించారు.

ఈ సభ్యులంతా ఎ. ఐ. సి. సి. కి అప్పీలు చేసుకొన్నారు. వర్కింగ్‌కమిటీ మొన్న 11న సమావేశమైనప్పుడు ఈ అప్పీలును విచారించి, ఈ విషయమై పరిశీలించి తగుచర్య తీసుకోమని రాష్ట్రపతికి అధికారమిచ్చింది.

రాష్ట్రపతి ఈ విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, ఆ సభ్యులందరికీ వారి వారి పదవులను తిరిగి ఒసగుచు నిర్ణయించారు. అంతేకాక, కార్యవర్గ ఎన్నికల సమయంలో అంతమంది సభ్యులను తొలగించడం జరిగినందున, కార్యవర్గమునకు జరిగిన ఎన్నికలు చెల్లనేరవని నిర్ణయిస్తూ, తిరిగి ఎన్నికలు జరుపవలెనని ఆదేశించారు. ఒక మాసంలోగా కొత్త ఎన్నికలు జరుపుటకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి అధికారమిచ్చారు.

## మూడు అరబ్ రాజ్యాల సమైక్యత

### కలనల్ హస్నీ చాయమ్‌తో ఇరాక్ ప్రధాని సంప్రతింపులు

బాగ్దాదు, ఏప్రిలు 18: సిరియా కొత్త నాయకుడు కర్నలు హస్నీజాయిమ్‌తో సంప్రతించి వచ్చిన ఇరాకు ప్రధాని, సిరియాపై ఇజ్రాయిలు దాడిచేస్తే అది ఇరాకుపై దాడిగా భావిస్తామని ప్రకటించాడు. ఇరాకు, సిరియా, ట్రాన్సుజోర్డానులు ఆర్థిక, రాజకీయ, సైనిక సమైక్యతలు సాధించడానికి మొదటి ప్రయత్నంగా ఇరాకు సిరియాలు ఏకమవుతున్నవని కొందరు భావిస్తున్నారు.

ఆరు అరబ్బుదేశాల ప్రతినిధులతో ఏప్రిలు 24న సంప్రతించడానికి ఇజ్రాయిలి ప్రతినిధులు లాసేన్ పోతున్నారు. ఇరాకుమాత్రమే ఈ సమాలోచనలలో పాల్గొనడంలేదు.

ఈస్టరు సందర్భంలో ఒకవారం వాయిదాపడిన ఇజ్రాయిలు ట్రాన్సుజోర్డను సంప్రతింపులు నేడు తిరిగి ఆరంభమైనవి.

ఈజిప్టుకు, ట్రాన్సుజోర్డనుకు గల విభేదాలన్నిటినీ చర్చించి ట్రాన్సుజోర్డను ప్రధాని, రక్షణమంత్రులు కయిరోనుండి నేడు అమ్మాన్‌కు తిరిగివచ్చారు. పాలస్తీనాలోని హెబ్రాన్, బెత్లెహేము జిల్లాలలో ఉన్న ఈజిప్టుసేనలు త్వరలో తమ స్థావరాలను ట్రాన్సుజోర్డాను వశం చేస్తవట.

## బర్మా సేనలకు కరెన్ తిరుగుబాటుదారుల లొంగుబాటు

### పర్వతనగరం మేమ్యో ప్రభుత్వ పటాలాల వశం

రంగూను, ఏప్రిల్ 19: మేమ్యోలోని కరేన్ విప్లవకారులు బర్మాప్రభుత్వ సేనలకు పూర్తిగా లొంగిపోయిరని, పట్టణమంతా తిరిగి ప్రభుత్వ స్వాధీనమైనదనీ రంగూనుకు చేరిన నాజావార్తలవలన తెలియుచున్నది. పట్టణంలోని కరేన్లు తెల్ల జెండాల నూపి, ఆయుధములు క్రింద బెట్టిరట.

మాండలేకు 40 మైళ్ళు ఉత్తరంగా ఉన్న ఈ పర్వత పట్టణములో కొంతభాగము ప్రభుత్వసేనలు వశపరచుకొన్నవని పూర్తిగా వశమైనదని ఇప్పుడే చెప్పుట కష్టమనీ గతరాత్రి బర్మాప్రభుత్వము చేసిన ప్రకటనలో నున్నది. మేమ్యోలోని కరేన్లు లొంగిపోయెదరని సందేశము పంపినట్లు మాత్రము గతరాత్రి ప్రకటన తెలిపినది.

ఉత్తరబర్మాలోని సగాయింగ్, మొనీవా, ష్వెబో, జిల్లాలలో రాకపోకలను అటంకపరచుటకై కమ్యూనిస్టులు, "తెల్లపతాక" ప్రజా వలంటీర్లు వంతెనల ననేకంగా ధ్వంసమొనర్చిరి.

ష్వెబోజిల్లాలో విప్లవకారులు పోలీసు స్టేషన్లపై దాడిచేసి ఆయుధములను కొల్లగొట్టి, 7 గురు మిలిటరీ పోలీసులను చంపిరనీ, ఇన్సీన్‌లోని కరేన్లు నగర మధ్యము నకు పారిపోవుచుండగా ప్రభుత్వ విమానములు వారి స్థావరములపై బాంబుచేసినవనీ, ప్రభుత్వము చేసిన ప్రకటనలో నున్నది.

## గడ్డినేతిని బహిష్కరించాలి

అలహాబాదు, ఏప్రెల్ 18: "జాతీయారోగ్యం దృష్టితో, అన్నిరకాల గడ్డినేతినీ వెంటనే బహిష్కరించి వేయాలి. వెంటనే తగునైన చర్యలు తీసుకోకపోతే, ఇప్పటికే పతనమైపోయిన ప్రజల ఆరోగ్యస్థితి మరింత అధ్వాన్నంగా మారి, అనేక ప్రమాదకరమైన పరిస్థితు లేర్పడుతై" అని, అలహాబాదు విశ్వవిద్యాలయం, న్యాయ శాఖా ప్రధానాచార్యులు ప్రొఫెసర్ కె. కె. భట్టాచార్యగారు ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ ఒక విజ్ఞప్తి చేశారు.

## స్థానభ్రష్టులైనవారి అస్తివిషయమే ఇండియా-పాకిస్థాన్‌ల నెదుర్కొంటున్న బ్రహ్మాండమైన సమస్య

— ప్రధానమంత్రి నెహ్రూ



న్యూఢిల్లీ, ఏప్రిలు 19: భారతప్రధాన మంత్రి పండిట్ నెహ్రూ లండన్ బయల్దేరి వెళ్ళే ముందు ఒక ప్రకటనచేస్తూ ఇండియా పాకిస్తానులమధ్య పరిష్కారం కావలసిఉన్న బ్రహ్మాండమైన సమస్య కాందిశీకుల ఆస్తివిషయమే అన్నారు. స్థానభ్రష్టులైన వారినుద్దేశించి ఇచ్చిన ఈ ప్రత్యేకసందేశంలో ప్రధానమంత్రి "ఈ సమస్య పరిష్కారమైపోతే ఇతర సమస్యలు వాటిస్థానాల నవి చేరగలవు," అని తెలియచేశారు.

దీర్ఘయాత్రపై రేపటంచి వెళుతూ ఉన్న యీ సందర్భంలో స్థానభ్రష్టులై వచ్చినవారికి తాను కొన్నిమాటలు చెప్పదలచితినంటూ ప్రధానమంత్రి ఈ విధంగా ఒక ప్రకటనచేశారు: "కాందిశీకుల స్థితి దుర్భరమైనది. మరే యితర సమస్యా మనుష్యుల్ని ఇంతగా కలవరపెట్టడంలేదు. అది బ్రహ్మాండమైన సమస్య. అపూర్వమైనది. ఆ సమస్యను శీఘ్రంగా, వేగంలో పరిష్కరింపలేకపోయినామంటే ప్రయత్నలోపం గాదు. అనుభవం లేకపోవడం, అవసరమైన సాధన సంపత్తి అందుబాటులో లేకపోవడమే యిందుకు కారణం. ఏమైనా ఇది మనందరికీ చాలా ప్రధానమైన, సత్వరం పరిష్కారం కావలసిన సమస్య. ఈ మన సోదరీ సోదరులను తిరిగి స్థావరం కల్పించడానికి సాధ్యమైనదంతా చేయడానికి ప్రభుత్వం ఆతురంగా ఉంది. కాని ఇంత బ్రహ్మాండమైన వ్యవహారాన్ని ఘడియల్లో, రోజుల్లో పరిష్కారం చేయడం సాధ్యంగాదని గ్రహించాలి. అందరూ, కాంద్రిశీకులు సహా ప్రభుత్వంతో సహకరిస్తేగాని ఈ సమస్య పరిష్కారంగాదు. అసలు ఈ కాందిశీకుల వైఖరి, దృక్పథమే అత్యంత ప్రధానమైనది. ఈ సహకారం లభించగలదనే నేను విశ్వసిస్తున్నాను.

నేను కొన్నాళ్లు దేశంవదలి వెళ్తున్నాను. నాకు మీరు కన్పించకపోయినా అనుక్షణం నేను వార్నిగురించే ఆలోచించుతూ ఉంటాను. ఈ విషయమై నేనువారికి హామీ ఇస్తున్నాను."

తమ సందేశాన్ని ముగిస్తు ప్రధానమంత్రి ఇలా చెప్పారు. "బ్రహ్మాండమైన సమస్యలను ఎదుర్కొనడానికి నేను వెళ్ళుతున్నాను. ఇవి మనదేశం, ఆసియా భవిష్యత్తునే మార్చివేయవచ్చును. అయినా. నేను ఎంతోదూరాన ఉన్నప్పటికీ ఇక్కడి మన సమస్యలను గురించి, అందునా ఈ రక్షణాగల సమస్యను గురించే నిరంతరం ఆలోచించుతూ ఉంటాను."

సిమ్లా, ఏప్రిల్ 18: గాంధి హత్యకేసులో శిక్షింపబడిన నారాయణ ఆప్టే, తూర్పుపంజాబు హైకోర్టులో తన అప్పీలు హియరింగుకు వచ్చినప్పుడు తాను స్వయంగా హాజరగుటకు అనుమతించవలసిందిగా జైలు అధికారుల ద్వారా దరఖాస్తు పెట్టుకొనెను.

## గంటల పంచాంగం

విరోధి సం॥ చైత్ర బ॥ అష్టమి 1949సం॥ ఏప్రిల్ 20 బుధవారం

బ॥ అష్టమిరా 9.25 ఉ.షా. ప 8 33 వర్జ్యం సా 7.54 ల 9.38 వ.

బ॥ నవమి ఏప్రిల్ 21 గురువారం సా॥ నవమి రా 11.12 శ్రవ సా5.37 వర్జ్యం రా 10.3 ల 11.50 వ.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ చైత్ర బ॥ అష్టమి బుధవారం

## పీపింగు చర్చలు

చైనా అంతర్యుద్ధము ఏ విధముగ సాగుచున్నదో, పీపింగ్‌లో సంధి సంప్రతింపులుకూడ ఇంచుమించు అదేవిధముగ జరుగుచున్నవి. చాంగ్‌కైషేక్ అధ్యక్ష పదవినుండి విరమించి, శాంతి స్థాపన సుకరము చేయుటకుగాను ఉపాధ్యక్షునకు అధికారము అప్పగించి దాదాపు రెండు మాసములైనది. తాత్కాలిక అధ్యక్షుడు లీసంగ్‌జన్ సంధి రాయబార వర్గమునుఎన్నుకొనుటకే మాసము పట్టినది. కమ్యూనిస్టులు ప్రతిపాదించిన షరతులను ఇంచుమించు పూర్తిగ అంగీకరించి పీపింగ్‌కు రాయబారవర్గమును పంపి పక్షము రోజులు గడచెను. సంప్రతింపుల గమనమును, పర్యవసానమును గురించి పరస్పర విరుద్ధమైన వార్తలు ప్రచార మగుచున్నవి. యుద్ధాపరాధుల విచారణ, దండనలపై కమ్యూనిస్టులు ఆదిలో ప్రతిపాదించిన అష్టసూత్ర ప్రతిపాదనలకు చెందిన ఒక షరతుపై సమాధానము కుదిరియుండలేదని, అందువల్లనే పీపింగ్ సంప్రతింపులలో ప్రతిష్టంభనము ఏర్పడినదని ప్రచారమైన వార్తలు సత్యముగాదని ఈ వారము వెల్లడియైన అధికార ప్రకటనలు స్పష్టము చేసెను.

యుద్ధాపరాధుల విషయమున తాము కనికరముతో వ్యవహరింతుమని కమ్యూనిస్టు నాయకుడు మావ్‌సీటంగ్ వాగ్దానము చేసినందున ఈ ప్రతిష్టంభనము పరిష్కారమై యుండవచ్చును. తిరిగి ఇపుడేర్పడిన ప్రతిష్టంభనము మొదటి అష్టసూత్ర ప్రతిపాదనాంశములపైగాక, ప్రభుత్వసేనల భవిష్యత్తు, దక్షిణదిశగ యాంగ్సీ నదిని దాటి కమ్యూనిస్టు సేనల పురోగమనములపై ఉభయపక్షములకు సమాధానము కుదురక పోవుటేనని తెలియుచున్నది. కమ్యూనిస్టులు తమ ఇరువది నాలుగు అంశముల శాంతిప్రణాళికను ఆమోదించుటకు ప్రభుత్వమున కొ... గడువు నేటితో తీరినది. నన్నటి వార్తలనుబట్టి ప్రభుత్వ ప్రతినిధులు ఇంకను ఈ క్రొత్త ప్రతిపాదనలపై చర్చలు జరుపుచుండ, కమ్యూనిస్టు దళములు యాంగ్సీ యుద్ధమును తిరిగి ప్రారంభించి, రెండు దీవులను ఆక్రమించినట్లు తెలియుచున్నది. కమ్యూనిస్టు సేనలు తిరిగి యుద్ధమును ప్రారంభించుటకు క్యుమింటాంగ్‌సండలి ప్రతీకవర్గములు గతవారము చింకిమాంగ్ రంగమున సాగించిన యుద్ధచర్యలే కారణమని చెప్పవచ్చును. చాంగ్‌కైషేక్ అధికార స్థానమునుండి వైదొలగినను, అధికారమును మాత్రము వదులుకొని యుండలేదు. ఇప్పటికిని సంధి సంప్రతింపులకు సంబంధించిన అన్నివ్యవహారములందును ఆయన జోక్యము పుచ్చుకొనుచునే యుండెను. యాంగ్సీనది సరిహద్దుగ చైనాను ఉత్తర, దక్షిణ రాజ్యములుగ విభజించు తమయభికారమును నిలుపుకొనుటకు క్యుమింటాంగ్ వర్గము ప్రయత్నించుచున్నట్లు ఇందువలన స్పష్టమగుచున్నది. కమ్యూనిస్టులు ఇట్టి విభజనకు ఏ పరిస్థితులలోను సమ్మతింపరనుటకు వారు తిరిగి ప్రారంభించిన యాంగ్సీ యుద్ధమే నిదర్శనము.

క్యుమింటాంగ్ అధ్వర్యమున, చైనాలో ఏభాగమునందైనను ప్రభుత్వ మేర్పడిన, తిరిగి పరిస్థితులు మొదటికి రాగలవను భయము, కమ్యూనిస్టులకు ఉండుట సహజము. ప్రస్తుతము 'జాతీయ చైనా'కు తాము సహాయము చేయుటవలన అంతర్యుద్ధము అంతము లేక కొనసాగుటేగాని, ఇతర ప్రయోజన మేమియు ఉండదు గనుక తాము చైనాకు ఇంక సహాయము చేయుట లేదని అమెరికా విదేశాంగ కార్యదర్శి డీన్ అచిసన్ ప్రకటించినప్పటికిని చైనా రాజకీయములనుండి అమెరికా పూర్తిగ విరమించుకొనెనని భావించుటకు వీలులేదు. ప్రపంచమందన్ని ప్రాంతములందును కమ్యూనిజం వ్యాప్తిని అరికట్టుటకు కంకణము కట్టుకొనిన అమెరికా చైనాపై కమ్యూనిస్టు ఆధిపత్య మేర్పడుటకు సమ్మతించుననిగాని, ఉపేక్షించి యుండుననిగాని విశ్వసించుటకు వీలులేదు.

చైనాలో కమ్యూనిస్టు ప్రాబల్య మేర్పడుటతో ప్రాచ్యఖండ రాజకీయతత్వము పూర్తిగ మారిపోవును. ప్రస్తుతము ఎటూచేరక యున్న రాజ్యములు విధిగ ఏదో ఒక వర్గమునచేరి, స్వరక్షణ ఏర్పాట్లు చేసుకొనవలసి యుండును. చైనా విభజనవలన ప్రాచ్యఖండమున కమ్యూనిస్టు వ్యాప్తికి కొంత అంతరాయము కలుగుట నిశ్చయము. కొరియానె అమెరికా, రష్యాలు ఉత్తరదక్షిణ ప్రాంతములుగ విభజించియుండ చైనాను అట్లు చేయరనుటకు ఎట్టి సందేహములేదు. స్పెయిన్‌లో వలెనె కొంత కాలమునకు క్యుమింటాంగ్‌పక్షము బలపడి తిరిగి యావత్తు చైనాను వశము చేసుకొనగలనని కొందరి విశ్వాసమై యుండవచ్చును. చైనా పరిస్థితిని, క్యుమింటాంగ్ పద్ధతులను గ్రహించిన అట్టి పరిణామము అసంభవమని స్పష్టముకాగలదు. చాంగ్‌కైషేక్ ప్రభృతులు ముఖ్యముగ ఈ విషయమును గ్రహించి, తాత్కాలిక అధ్యక్షుని శాంతిసాధనా యత్నములకు అంతరాయములు కల్పింపకున్న చైనాసమస్య స్థిరముగ, ప్రజలకు సంతృప్తికరముగ పరిష్కారము కాగలదు. లీసంగ్‌జెన్ ప్రభుత్వమునకు కమ్యూనిస్టుల శాంతి ప్రణాళికను అంగీకరించుటకంటె మార్గాంతరము లేదు. కాలహరణమువలన పరిస్థితి విషమించి, తిరిగి భారీ ఎత్తున యుద్ధము ప్రారంభము కాగలదు. లీసంగ్‌జన్ ప్రభుత్వము ఇట్టి పరిణామమునే వాంఛించుచుండిన పీపింగ్ సంప్రతింపులను కొనసాగించుటలో అర్థము లేదు. కమ్యూనిస్టు పక్షముకూడ పరాజితులకు ఆదేశముల నిచ్చుటకు బదులు, ఉభయులకు గౌరవప్రదముగ, ప్రజలకు ప్రయోజనకరముగ నుండునట్లు శాంతి ఒడంబడికను కుదుర్చుకొనవలెను. లేకున్న 1917 సంవత్సర విప్లవానంతరము దాదాపు ఒక దశాబ్దముగ రష్యా ఎదుర్కొనవలసిన సమస్యల నే ఎదుర్కొనవలసి యుండును. వాటిని పరిష్కరించుకొని ముందుకు సాగగల తాహతు ప్రస్తుతము తమకు లేదని గ్రహించుట చైనా కమ్యూనిస్టులకు అవసరము.

## డబ్లిను నగరంలో రిపబ్లికు ప్రారంభోత్సవం
### ప్రార్థనలకుమాత్రం డివెలరా ప్రభృతుల హాజరు

డబ్లిను, ఏప్రిలు 18 : 1916 లో బ్రిటిషు ప్రభుత్వంపై తిరుగుబాటు సాగించిన రిపబ్లికనులకు కేంద్రస్థానమైన డబ్లిను జనరలు పోస్టాఫీసులో ఐరు రిపబ్లికు ప్రారంభోత్సవం నేడు అతి వైభవంగా జరిగింది.

పోస్టాఫీసువద్దకు భార్యా సమేతుడై వచ్చిన అధ్యక్షుడు సియాన్ ఓకెల్లీకి మేజరు జనరలు ఆర్చర మొదలైన ఉన్నత సైనికాధికారులు స్వాగతం ఇచ్చారు. బాజాలు మోగుతుండగా ఒక చిన్న సైనికాధికారి రిపబ్లిక జెండా ఎగరవేశాడు. సైనికుల కవాతుతో ఉత్సవము పూర్తిఅయి జాతీయగీతం పాడారు.

చర్చిలో జరిగిన పూజకు ప్రభుత్వ నాయకులందరూ హాజరైనారు. ఈమన్ డివలేరా, ఆయన పక్షంవారుకూడా యీ పూజలలో పాల్గొన్నారు. ఈ ఉత్సవంలో డివలేరా పక్షంవారు పాల్గొన్నది ఈ పూజలలో మాత్రమే. ఐర్లండు విభక్తమై ఉన్నంతకాలమూ సంతోషానికి కారణం లేదని ఈ వర్గాలవారి భావం.

నేటిమధ్యాహ్నం డబ్లినులో పత్రికా విలేఖరులతో ఐరు ప్రధాని జాన్ కాస్టెలో ఈ విధంగా చెప్పాడు:

"మనం ఇప్పుడు ఒంటరిగాళ్ళం. మన కెవరితోనూ బంధాలూ, ప్రతిబంధకాలూ లేవు. అయినా మనం, అల్పసంఖ్యాకులమైనా, స్వతంత్రులం. దేశ విభజన అంతమయ్యే వరకూ మనం శాంతిరక్షణకు ఆర్థికంగాగాని, సైనికంగాగాని పూర్తిగా సహకరించలేం.

"రక్షణ, విదేశీ వ్యవహారాలు సంయుక్త ఐర్లండు ప్రభుత్వం కింద ఉండే పక్షంలో ఉత్తర ఐర్లాండు ప్రజలు వేరే ప్రభుత్వం కింద ఉండడానికి మేము అభ్యంతరం పెట్టం.

"మేము బ్రిటనుతోనూ, ఇతర కామన్వెల్తు రాజ్యాలలోను తెగతెంపులు చేసుకున్నప్పటికీ ఇకముందు ఐర్లండుకూ, బ్రిటనుకూ, కామన్వెల్తు రాజ్యాలకూ మధ్య ఇతోధిక సంబంధ సహకారాలుంటవని మా విశ్వాసం."

## రిపబ్లికుపై వ్యాఖ్యలు

ఐరు రిపబ్లికు స్థాపనపై న్యూయార్కు 'హెరాల్డు ట్రిబ్యూను' ఈ విధంగా వ్యాఖ్యానించింది:

"బ్రిటిషు సామ్రాజ్యము విచ్ఛిన్నమై, అన్నిదేశాలూ బర్మావలె ఆత్మవినాశకరమైన దారితొక్కితే ఫలితం ప్రమాదకరంగా ఉంటుంది. అయితే బ్రిటిషు కామన్వెల్తుయొక్క స్వరూపం అతి విచిత్రమైనది. అందులో అనేక రూపభేదాలకు అవకాశంఉన్నది. జాతులసమీకరణ జరుగుతూఉన్న ఈ కాలంలో క్రొత్తరాజ్యాలు పుట్టుకరావడం గమనించదగినది. అయినా ఐరు రిపబ్లికు తన స్వాతంత్ర్యానికి భంగంలేకుండా శాంతి నెలకొల్పడానికి సమిష్టిసహకారంలో పాల్గొనే సభ్యరాజుగా ఆహ్వానించబడదగినదే."

బ్రిటిషు కాన్సర్వేటివు పత్రిక "డెయిలి టెలిగ్రాఫు" ఈ విధంగా వ్యాఖ్యానించింది:

"కొందరు ఐరిషు పౌరులకు బ్రిటిషు పౌరసత్వం ఉండేటట్లు కిందట ఏడు బ్రిటను ఒక చట్టం నిర్మించింది. ఈ ఏర్పాటు రిపబ్లికు పౌరులకు వర్తించడం సందేహాస్పదం. ఐరు రిపబ్లికు బ్రిటను అధికారంనుంచి పూర్తిగా వేరుపడిపోయింది. రిపబ్లికు పౌరులకు కామన్వెల్తులో ఉండే అధికారం ఉన్నదా అనేది తేలవలసి ఉన్నది. బ్రిటిషు సింహాసనముతో సంబంధం లేకుండా నెహ్రూ కామన్వెల్తులో ఉండగోరుతున్నాడు. ఆ విధంగానే డా॥ మలాన్‌కూడా కోరుతున్నాడు. కాని స్మట్సు చెప్పినట్లు ఎవరైనా కామన్వెల్తులో ఉండగలరు, లేదా బయట ఉండగలరు. కాని మూడవ మార్గం లేదు. ఈ మాట లండనులో ఆరంభం కావనున్న కామన్వెల్తు చర్చలకు సూటిగా తగులుచున్నది."

## "జననాయక్"

మీరట్, ఏప్రిల్ 18: రఘువీరశరణ్ అనే ఒక ప్రసిద్ధ హిందీకవి గాంధీమహాత్ముని గురించి ఒక మహాకావ్యము రచించెను. ఈ కావ్యమునకు పేరు "జననాయక్". కావ్యం 31 అధ్యాయములుగ విభక్తమైయున్నది. రాష్ట్రపతి పదవి నధిష్ఠించిన డా॥ రాజేంద్రప్రసాదుగారు గ్రంథమునకు పీఠిక వ్రాయుదురు.

## ఇటలీ వలసలు

1 వ పేజి తరువాయి

బడి, పీఠానంత స్వల్పవ్యవధిలో వారు స్వతంత్రాత్ములవుదురని మేము భావించుచున్నాము.

ఏ ఒక్క రాజ్య, పరిపాలన క్రిందగాని ఈ వలసలను ఉంచుట జనకటి పరిస్థితులను కోరి తెచ్చుకొనుటేయగును.

ఐ. రా. ధర్మకర్తృత్వసంఘమువారు ఆచరణలో పెట్టుటకు అనువుగా మేము ఒక అష్టసూత్రప్రణాళికను ప్రతిపాదించుచున్నాము.

(1) ప్రతి వలసకు, అల్పరాజ్యములనుండి ఒక గవర్నరు నెన్ని నియమించవలెను. (2) పరిపాలనలో ఉద్యోగములు నిర్వహించుటకై అంతర్జాతీయ ఉద్యోగి దళము నొకదాని నేర్పాటు చేయవలెను. (3) వలసల పరిపాలనను సమితి స్వాధీన పరచుకొనేవరకూ ప్రస్తుత పరిపాలననే కొనసాగనివ్వవలెను (4) స్థానిక ప్రజల నుండి, సమితి సభ్యదేశములనుండి పోలీసు దళము నొకదానిని ఏర్పాటుచేయవలెను. (5) ప్రస్తుత పరిపాలనల సహాయములోను సలహాలోను, క్రొత్త పరిపాలనలను స్థాపించవలెను. (6) ప్రతి వలసపైన గల సమితి పరిపాలనకు సహాయముచేయుటకు స్థానిక ప్రజాప్రతినిధుల కౌన్సిలు నొకదాని నేర్పాటు చేయవలెను. (7) సమితి ధర్మకర్తృత్వసంఘము ఆ పరిపాలనలపై ఎప్పటికప్పుడు అజమాయిషీ జరుపుచుండవలెను. (8) 10నుండి 20 ఏళ్లలోగా ప్రతి వలసలోను జనవాక్యనిర్ధారణ జరిపి, అచటి ప్రజలు స్వతంత్రంగా ఉండగోరెదరో, లేక ప్రక్క ప్రదేశముతో కలియగోరెదరో నిర్ణయింపవలెను.

ఈ పథకము నమలుపరచుటలో సమితి, వేరే ప్రయోజనాలను, రాజకీయ తంత్రములను మనస్సులో పెట్టుకొని వ్యవహరింపరాదు. కేవలం వలస ప్రజల క్షేమాభివృద్ధులను కాంక్షించి మాత్రమే వ్యవహరింపవలెను.

అంతేగాక, మన నిర్ణయము ఈ వలసలను శాశ్వతంగా విభజించునదిగా ఉండకూడదు.

ఈ వలసలలోని పరిస్థితులను పరిశీలించి భోగట్టా సేకరణ సంఘము సమర్పించిన నివేదికవలన ప్రజలు స్వపరిపాలన కింకా అర్హులుగా లేరని తెల్లమగుచున్నది. కనుక మనము చేయబోవు నిర్ణయము వారి రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యాభివృద్ధులకు దోహదమిచ్చునదిగా ఉండవలెను. ఈ సంగతి సమితి ప్రణాళికలో కూడ నిర్వచింపబడి యున్నది.

అచటి ప్రజలలో భిన్న భిన్నాభిప్రాయములు, వాదములు కూడ చెలరేగుచున్నవని భోగట్టాసంఘ నివేదిక తెలుపుచున్నది. వలసలపై కన్నువేసి ఉన్న భిన్న రాజ్యములలోనూ, వలసలలోని భిన్న రాజకీయ సంస్థలలోనూ కూడ ఈ భిన్నాభిప్రాయములు ప్రబలియున్నవి. కనుక వీనిని నిష్పాక్షికంగా సమితి సమన్వయం చేయవలసిఉన్నది.

వలసలపై ఏదో ఒక రాజ్యమునకే ధర్మకర్తృత్వాధికారము నిచ్చుటకంటె, సరాసరి సమితి ధర్మకర్తృత్వమే మంచిదని ఇండియా అభిప్రాయపడుచున్నది. ఒక్క రాజ్యమునకే అప్పగించుటవలన, ఆరాజ్యము వలసదేశాభివృద్ధికై తన ఆర్థిక సహాయమును వినియోగించుట, తద్వారా ఆరాజ్యమునకు హక్కులేర్పడుట, వలసప్రజలపై ఆరాజ్యపు ప్రాబల్యము స్థిరపడుట జరుగును.

ఆఫ్రికన్ వలసలయొక్క నీలక ప్రాధాన్యతనుబట్టి అవి ఒక్క రాజ్యమునకే అప్పగింపబడుట మంచిదని అమెరికా ప్రతినిధి చేసిన వాదనతో ఇండియా ఏకీభవింపలేదు. ఇంతవరకూ ఏవలసపైననూ ఐ. రా. ధర్మకర్తృత్వములేదు. ప్రణాళిక అనుమతించుచున్నప్పుడు అట్లు ఏల చేయరాదో తెలియుటలేదు.

సరాసరి సమితి ధర్మకర్తృత్వము అచరణసాధ్యమని నిరూపించుటకు మా ప్రతినిధివర్గము ఈ దిగువ సూచనలను చేయుచున్నది.

1. సరాసరి ధర్మకర్తృత్వమును ఆమోదించుచు సమితి జనరల్ ఎసెంబ్లీ ఒకతీర్మానమును చేయవలెను. వలసదేశములను పరిపాలించుటకు కావలసిన విధానములను, ప్రస్తుత పరిపాలనలను అంతమొందించి సమితి పరిపాలనలను నెలకొల్పుటకను వైన సమయములను, ధర్మకర్తృత్వ సంఘమువారు నివేదికగా తయారుచేసి సమితికి సమర్పింపవలెను.

2. భద్రతామండలిలోగాని, ధర్మకర్తృత్వ సంఘములోగాని శాశ్వతసభ్యులుగాలేని రాజ్యములనుండి ప్రతి వలసకు ఒక్కొక్క గవర్నరు నెన్నుకొని ధర్మకర్తృత్వ సంఘము సమితి ఎసెంబ్లీకి ఆసంగతి చెప్పవలెను. అంతర్జాతీయ ఉద్యోగిదళమును తయారు చేయవలెను. సమితి స్వాధీన మొనర్చుకొనువరకు ప్రస్తుత పరిపాలనల సహాయముతో క్రొత్తపరిపాలనల నేర్పరచవలెను. స్థానిక ప్రజల ప్రతినిధులతో సమితి పరిపాలకులకు సలహాసంఘములను ఏర్పాటు చేయవలెను. అప్పుడప్పుడు పరిపాలనలపై సమితి అజమాయిషీ జరుపుచుండవలెను. 10 నుండి 20 ఏళ్ళలోపల ప్రతి వలసలోను జనవాక్యనిర్ధారణను జరుపవలెను.

ఈవలసల పరిపాలనను నిర్వహించుట కయ్యే వ్యయభార విషయమై యిందాక చర్చవచ్చినది. వలసప్రజలను ఉద్ధరించి సమితి ఆదర్శములను నెరవేర్చుటకై ఈ మాత్రము వ్యయభారమును వహించుట ధర్మమేనని మా ప్రతినిధివర్గపు ఉద్దేశ్యము. అని సెటల్వాడ్ తన ప్రసంగమును ముగించెను.

## జమైతుల్ ఉలేమా మహాసభలో తీర్మానము

లక్నో, ఏప్రిల్ 18 : జమైతుల్ ఉలేమా మహాసభలో గతరాత్రి ముస్లిం సామాజికఉద్ధరణ, ముస్లింవిద్యార్థులకు మతబోధన సంబంచిన తీర్మానములు అనేకము చేయబడినవి.

సర్కారుబడులలో ముస్లింవిద్యార్థులకు మతబోధ చేయడానికి ముస్లిం లకు ఏర్పాటు చేయవలసిందని కోరుతూ ఒక తీర్మానము చేసిరి. ముస్లింమతస్థులకు ప్రాథమిక విద్యాశాలలహోదా యివ్వవలసిందని కోరవలసినది. ముస్లింలలో కుల భేదములను రూపుమాపుటకు కృషిచేయవలెనని తీర్మానించిరి.

## సర్ జఫ్రుల్లా ప్రతిపాదనలు

లేక్‌సక్సెస్, ఏప్రిల్ 18: లిబియా, సోమాలీలాండులలోని పూర్వపు ఇటాలియన్ వలసలపై రష్యా సూచించిన పరిష్కార విధానము ననుసరించుచు, అవి కొంతకాలంవరకూ ఐక్యరాజ్య ధర్మకర్తృత్వంక్రింద ఉంచబడవలెనని పాకిస్థాన్ ప్రతినిధివర్గ నాయకుడు సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ నేడు రాజకీయ సంఘంలో కొన్ని ప్రతిపాదనలు చేసెను.

ఈ ప్రతిపాదనలు అరబ్బీ రాజ్యాలవైఖరిని ధ్వనించుచున్నవని రాజకీయజ్ఞులు భావించుచున్నారు.

1. సైరినాయ్కా, ట్రిపోలిటానియా, ఫెజ్జాన్ వలసల ఐక్యతకు భంగం రాకుండా వానిని 5 ఏండ్లవరకూ ఐ. రా. ధర్మకర్తృత్వమునకు అప్పగించవలెను. అపిమ్మట లిబియా యావత్తూ స్వాతంత్ర్యమును పొందవలెను.

2. సోమాలీ లాండును పదేండ్లవరకూ ఐ. రా. ధర్మకర్తృత్వమున కప్పగించవలెను: అటుపిమ్మట దానికి స్వాతంత్ర్యమునివ్వవలెను.

3. ఈ ప్రదేశములను పాలించుటకు నియమింపబడే ఐ.రా. అధికారికి సహాయము చేయుటకు 9 మంది సభ్యులతో సలహాసంఘ మొకటి స్థాపింపబడవలెను. ఈసంఘంలో బ్రిటన్, రష్యా, అమెరికా, ఫ్రాన్సు, ఇటలీ ప్రతినిధులు, ఆవలసలలోని యూరోపియన్, స్వదేశీయ ప్రజల ప్రతినిధులు, ఈజిప్టు ప్రతినిధి, మరొక మధ్య ప్రాచ్యరాజ్యపు ప్రతినిధి ఉండవలెను.

ఎరిత్రియాపై సర్ జఫ్రుల్లా ప్రత్యేకముగా నిర్దిష్ట ప్రతిపాదన లేమీ చేయలేదు. కాని ఎరిత్రియాలోని ప్రాచీన ఈజిప్షను ప్రజాప్రదేశమును అబిసీనియా కోరుటపై విమర్శించుచు, ఆ ప్రదేశము తనకు రావలెనని ఎథియోపియా కోరుచున్నట్లయితే, సోమాలీలు నివసించే ఒగాడెన్ రాష్ట్రమును, దాని చుట్టుప్రక్కల ప్రాంతములను సోమాలీలాండు కప్పగించవలసి ఉంటుందని అతను చెప్పెను.

ట్రిపోలిటానియాపై ఇటలీకి ధర్మకర్తృత్వాధికారము నిచ్చినచో, తత్పరిపాలన ఇప్పుడిప్పుడే అచ్చటి యూరోపియనులమధ్య, స్వదేశీయులమధ్య ఏర్పడుచున్న సహకార భావమును నాశన మొనర్చునని సర్ జఫ్రుల్లా హెచ్చరించెను.

ట్రిపోలిటానియాను ఇటలీ మొదటగా ఆక్రమించుకొనినరోజులలో అచ్చటి అరబ్బులను ఇటాలియనులు పెట్టిన నరకబాధలు, అమానుష ఘాతుకహింసలు అరబ్బుల స్మృతిపథమునుండి ఇంకా తొలగిపోలేదని, తిరిగి వారిని ఇటలీ కప్పగించుట పులినోటికి తల నందిచ్చుటే నని, దానివలన పాలక, పాలిత వర్గములమధ్య తిరిగి ఘోరమైన మత్సరము తలఎత్తుననికూడ సర్ జఫ్రుల్లా హెచ్చరించెను.

సర్వప్రతినిధియుక్తమైన ఐక్యరాజ్య ధర్మకర్తృత్వముకలన లిబియా ఐక్యత చెడిపోకుండా, ప్రజల సహకారము పైతము లభింపగలదని, ఫెజ్జాన్ ప్రాంతమును ఫ్రాన్సుకు ధర్మకర్తృత్వముగ నిచ్చుట దానిని శాశ్వతముగా ఫ్రాన్సుకు వర్తముచేయుటే నని అతడు వాదించెను.

సైరినాయ్కాపై బ్రిటన్ ధర్మకర్తృత్వమును చీ ప్రతినిధి సమర్థించెను. ట్రిపోలిటానియా, సోమాలీలాండులకు ఇటలీకే అప్పగించవలెనని అతనన్నాడు.

## నెహ్రూ లండన్ ప్రయాణం

1 వ పేజి తరువాయి

పిమ్మట నేడు లండను చేరాడు.

పాకిస్తాను తరుపున విదేశాంగమంత్రి సర్ మహమ్మదు జఫ్రుల్లాఖాను నిన్న న్యూయార్కునుంచి విమానంపై లండను బయలుదేరాడు.

### ఇండియా ప్రాధాన్యం

లండను, ఏప్రిలు 18 : లండనులో గురువారం ఆరంభంకానున్న కామన్వెల్తు సమావేశం చారిత్రకమైనది. మరొక వారంలోగా కామన్వెల్తు స్వరూపంలో గొప్ప పరివర్తన కలుగవచ్చును. ఈ సందర్భంలో యిక్కడి వారి చర్చలన్నీ ఇండియాపై కేంద్రీకరించబడుతున్నవి.

ప్రజాతంత్ర రిపబ్లికు కానున్న ఇండియా తన దేశాలతో కలిసి ఏ విధముగా సహకరించేదీ కామన్వెల్తు రాజకీయవేత్తలు జరుగగల సమావేశంలో నిర్ణయించవలసి ఉన్నది.

అధినివేశ ప్రధానులలో దాదాపు అందరూ స్వయంగా వచ్చి ఈ సమావేశంలో పాల్గొంటూ ఉండడాన్నిబట్టి దీని పర్యవసానంయొక్క ప్రాముఖ్యం విదితమవుతున్నది. ఈ పర్యవసానం ఇండియా ఆశయాలకు అనుకూలంగా ఉంటుందని భావించబడుతున్నది.

అప్పుడప్పుడు ప్రధాన నాయకులన్న మాటలనుబట్టి పత్రికలు ఊహాగానాలు సాగించినప్పటికీ వీటినెవరూ పాటించడం లేదు. ఇట్టి ఊహాగానాలు సమావేశ చర్చలకు అంతరాయంగ కూడా భావించబడుతున్నవి.

ఈస్టరు శెలవులలో ఇక్కడి అధికారులుసమావేశసన్నాహాలు చేయడంలోనూ, కామన్వెల్తు ప్రతినిధులకు స్వాగతం ఏర్పాటుచేయడంలోనూ నిమగ్నులైనారు. వారాంతం పల్లెపట్టులకు పోయి ఉండిన బ్రిటిషు ప్రధాని అట్లీ ఈ ఏర్పాటులు సరి చూడడానికి నేడు లండను తిరిగివచ్చాడు. ఆయన వారమంతా తన చారులు విభిన్న అధినివేశాలకు పోయివచ్చి సమర్పించిన నివేదికలు పరిశీలించడంలో గడిపాడు.

గత లండను సమావేశం జరిగిన ఆరుమాసాలకు, గురువారంనాడు కామన్వెల్తు సమావేశం ఆరంభమవుతుంది. ఇది 10, డౌనింగు స్ట్రీటులోని కాబినెటు గదిలో జరుగుతుంది.

## రైల్వేరేట్ల విచారణసంఘం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: రైల్వేరవాణా చార్జీలవిషయమై వచ్చేఫిర్యాదులను విచారించుటకు స్థాపింపబడిన రైల్వేరేట్ల విచారణసంఘమునకు కొల్హాపూర్ హైకోర్టు ప్రధానన్యాయమూర్తి ఎస్. ఎస్. లోకూర్ ప్రథమఅధ్యక్షుడుగా నియమింపబడెను. అలహాబాదు బారిష్టరు ఎల్. ఎస్. రాయ్, ఒరిస్సాన్యాయవాది శౌరి ప్రసాద్ మహాపాత్ర సభ్యులుగను, ఎమ్. ఎస్. ఎస్. రైల్వే డిప్యూటీ జనరల్ మేనేజరు కల్యాణరామన్ కార్యదర్శిగను నియమింపబడిరి.

## మధ్యభారత రాజకీయాలు
### సర్దార్ పటేల్ కల్పించుకొనడు

గ్వాలియర్, ఏప్రిల్ 18: మధ్యభారత సంస్థానకూటమి ఉపప్రధానిఅయిన వి.ఎస్. భోడేగారు న్యూఢిల్లీలో సర్దార్ పటేల్ను కలుసుకొని గ్వాలియర్‌కు నేడు తిరిగి వచ్చిరి. గ్వాలియర్‌నుంచి ఇవాళ అపరాహ్ణం వీరు ఇండోర్‌కు వెళ్లిరి.

మధ్యభారత సంస్థానకూటమి రాజకీయములలో జోక్యం కల్పించుకొనన్ సర్దార్ పటేలు నిరాకరించెనని, గ్వాలియర్‌లో ఏప్రిల్ 22 న జరుగనున్న పార్టీసమావేశంలోనే నాయకత్వ సమస్యను తేల్చుకోవలసిందని పార్టీలో ప్రస్తుత ప్రధానికి వ్యతిరేకమైన వర్గానికి ఆయన సలహా ఇచ్చెనని తెలియుచున్నది. భోడే గారు ఇదివరకే ఉపపదవికి రాజీనామా ఇచ్చిరి. ప్రధానమంత్రి లీలాధర్ జోషి పై అవిశ్వాసతీర్మానమును ప్రతిపాదించనున్న వర్గానికి వీరు తోడ్పడుదురని తెలియుచున్నది.

## యోగశాస్త్రంపైన స్కాండినేవియా దేశాల ఔత్సుక్యం

బొంబాయి, ఏప్రిల్ 18: భారతదేశపు సంస్కృతిపట్ల ముఖ్యంగా యోగశాస్త్రంపట్ల స్కాండినేవియా దేశాలు, చాలా మక్కువైన కోర్సుకొన్ని చూపుతున్నట్లు, బొంబాయిలోని శాంతాక్రజ్ యోగశిక్షణ కేంద్రం వారికి వస్తున్న ఉత్తరాలనుబట్టి తెలుస్తున్నది. ఆ దేశాల్లో యోగశాస్త్ర గ్రంథాలు చాలా విరివిగా ఖర్చవుతున్నాయట.

ఆ దేశాలలో భారతీయ రాయబారులు కేవల రాజకీయ కార్యకలాపాలతోనే ప్రాముఖ్యముంచక, భారతీయ సంస్కృతిపట్ల ఇట్టి ఉత్సుకతను కలిగించుటానికి ఇతోధికంగా ప్రయత్నించుచున్నారని తెలుస్తున్నది.

## చెన్నపట్నం నౌకాశ్రయ వ్యాప్తి
### మెరీనాబీచి పాడగునని అసెంబ్లీలో ఆక్షేపణ

చెన్నపట్నం, ఏప్రిల్ 19 : మద్రాసు ప్రభుత్వ పబ్లిక్‌వరక్సు మంత్రి భక్తవత్సలంగారు శ్రీ ముత్తయ్య చెట్టియారుకు సమాధానముగా చెన్నపట్నం నౌకాశ్రయాన్ని దక్షిణదిశగా వ్యాప్తిచేయుటకు ప్రతిపాదన ఉన్నదనియు, కార్పొరేషను వారు దానికి అభ్యంతరము తెలిపినమాట నిజమనియు చెప్పిరి. ఉప ప్రశ్నలకు సమాధానంగా మద్రాసు ప్రభుత్వం దానికి అంగీకరించెననిరి.

శ్రీ రామస్వామిమొదలియారు : మెరీనా బీచి సౌందర్యమును ఈ ప్రణాళిక పాడు చేయదా?

స : గౌరవ సభ్యుడు ఆయనకు ఉన్న ఆక్షేపణలు చెపితే, చర్చించి అందం చెడకుండా ఉండే ఏర్పాటు చేయవచ్చును.

హమీద్ ఖాన్‌గారు : గత్యంతరము లేదా?

స : లేదు. అన్నివిధాల ఇదే ఉత్తమం.

కరంత్ గారు : దీనికి తీవ్రమైన వ్యతిరేకాభిప్రాయము ఉన్నందున ఈ సభనుంచి ఒక ఉపసంఘాన్ని వేసెదరా?

స : అనుభవజ్ఞుల మాట అట్లాఉండగా మేము వప్పుకోకపోతే అసలు వ్యవహారమే మానేస్తామని భారత ప్రభుత్వంవారన్నారు.

హమీద్ ఖాన్‌గారు : ఉత్తర మద్రాసు వాసులకు అనుకూలముగా చేసెదరా?

స : రైల్వేలైను రోడ్డు 600 అడుగుల దూరంలో ఉండును.

శ్రీ రాఘవయ్య : కోటకు ఎదురుగా కట్టుతూన్న మిలిటరీ దృష్ట్యా అభ్యంతరము లేదా?

స : మిలిటరీకి ఇది సంబంధించి లేదు.

హమీద్ ఖాన్‌గారు : సభ్యులకు స్కీము వివరాలు అందచేస్తారా?

స : పూర్తిఅయినపుడు కేంద్రప్రభుత్వ అనుమతిపొంది పత్రికాప్రకటన చేస్తాము.

జి. రాజమన్నార్ చెట్టి : కార్పొరేషనువారు వద్దంటున్నా, ప్రభుత్వంవారు వారిని నిర్లక్ష్యం ఎందుకు చేసిరి?

స : ఇది మద్రాసు ప్రభుత్వానికి సంబంధించినదే కాదు. ఒక్క స్థలం అడిగినప్పుడు ఇవ్వవలసినది. ఇందువల్ల 10 లక్షల టన్నుల సరుకు ఎగుమతుల దిగుమతులకు సౌకర్యం వస్తుంది.

డా॥ సుబ్రహ్మణ్యం : ఆంధ్రులు విడిపోయినప్పుడు దీనిగతి ఏమి?

స : దానికి సమాధానం నేనుకాదు చెప్పేది.

శ్రీ విశ్వనాథం : విశాఖపట్నంహార్బరు బాగుపడుతూన్నందున ఇది అనవసరం కాదా?

స : భారతప్రభుత్వం వారంనుకు అంగీకరించరు.

జి. రాజమన్నారు చెట్టిగారు : అనుభవజ్ఞులుకూడా తీవ్రముగా విభేదాలు తెలిపినారుగదా?

స : భారతప్రభుత్వం ఇది చెయ్యాలనుకున్నది. మేము సహాయ నిరాకరణం చెయ్యవచ్చుగాని సహాయం చెయ్యటమే అవసరం.

శ్రీ రాజమన్నారుచెట్టి : ప్రజాభిప్రాయం ప్రబలంగా వ్యతిరేకంగాఉన్నా ఈ స్కీము అమలుచేస్తే నగర పౌర సంఘంవారు సత్యాగ్రహం చేస్తారని తెలియునా?

స : పౌరులకు నచ్చచెప్పగలనను ధైర్యం నాకున్నది.

అన్వర్ గారు : లైటుహౌస్ క్రాసింగు దగ్గర ఓవరుబ్రిడ్జి కట్టించెదరా?

స : ఈ స్కీములో నిమిత్తంలేకుండానే ఆ విషయాన్ని ఎత్తుకున్నాము.

ప్ర : బకింగ్‌హాంకాల్వ, కూవంనదులలో నౌకారవాణాసౌకర్యాభివృద్ధి కలుగచేస్తారా?

స : వేరేప్రశ్న వెయ్యండి.

## శాసనసభల నాయకులు

మద్రాసు, ఏప్రిల్ 19: మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీనాయకుడుగా డా॥ బి. గోపాలరెడ్డిగారు, కౌన్సిలు నాయకుడుగా డా॥ టి. యస్. యస్. రాజన్ గారు యథాప్రకారం ఉండెదరని ప్రభుత్వం నిర్ణయించినది.

### ఉద్యోగులు

ఎన్. రంగస్వామిగారు, కృష్ణజిల్లా పోలీసుకు 2 నెలలు సెలవిచ్చిరి.

### మద్రాసుకు హైదరాబాదు మిలిటరీ గవర్నరు రాక

మద్రాసు, ఏప్రిల్ 19: హైదరాబాదు మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌదరి సెలవు పరిపాలనను చూసుకొను ఇక్కడి ప్రభుత్వాధికారులతో హైదరాబాదులోని కమ్యూనిస్టు చర్యలను గూర్చి మాట్లాడుటకై విమానములో వచ్చుచున్నారు.

# కాశ్మీర్‌లో అక్రమంగా ఆక్రమించిన స్థావరాలను ఖాళీ చేయడానికి పాకిస్థాన్ సమ్మతి

## భారత సేనానితో ఒప్పందం

### మధ్యవర్తిసంఘ యుద్ధవిరమణ ప్రతిపాదనలకు ఢిల్లీ సమాధానం

శ్రీనగర్, ఏప్రిల్ 18: ఎక్కడి సైన్యాలు అక్కడే నిలిచిపోవాలన్న యుద్ధవిరమణసూత్రాలకు విరుద్ధంగా కాశ్మీర్ రంగంలో ఈ మధ్య తమ సేనలు కొత్తగా ఆక్రమించుకున్న ప్రాంతాలనుండి వాటిని వెనక్కు పిలిపించడానికి పాకిస్థాన్ ప్రభుత్వం అంగీకరించినది. కాశ్మీర్ రంగంలో భారత సేనాని మేజర్ జనరల్ తిమ్మయ్య పాకిస్థాన్ సేనాని మేజర్ జనరల్ నజీర్ అహమ్మద్‌తో సంప్రదింపులు జరిపినమీదట వారిరువురికి ఈ ఒడంబడిక కుదిరినది.

# 'సాలుకు 50 లక్షలటన్నుల ఉక్కు ఉత్పత్తి అవసరం'

## విశ్వేశ్వరయ్యగారి సూచనలు

బొంబాయి, ఏప్రిల్ 18: భారతక్షేత్రంలో ఉక్కు ఇనుము ఫ్యాక్టరీలను ఏర్పాటు చేయవచ్చునని, ఎక్కడెక్కడ ఏర్పాటు చేయవచ్చును. సయమై ఇండియా ప్రభుత్వమునకు సలహా నిచ్చుటకు బ్రిటిష్ ప్రవీణులు కొందరును అమెరికను ప్రవీణులు కొందరును దేశమంతటను పర్యటనము చేసి తమ సలహాలను ఇచ్చుచూ నివేదికను తయారు చేసిరి. ఇది గతవారము ప్రకటింపబడెను. టాటా ఉక్కు ఫ్యాక్టరీలోను మైసూరులోని భద్రావతి ఫ్యాక్టరీలోను బెంగాలులోని స్టీల్ కార్పొరేషనులోను ఇప్పటికంటె ఎక్కువ ఉక్కు తయారుచేయుటకై ఆ ఫ్యాక్టరీలను పెంచవలెననియు, క్రొత్తగా ఒరిస్సాలో ఒక ఫ్యాక్టరీని, బీహారులో మరొకటియు, ఏర్పాటు చేయవలెననియూ సిఫార్సు చేసిరి.

మైసూరులోని భద్రావతీ ఉక్కు ఫ్యాక్టరీని ఏర్పాటుచేయించిన, ఇంజనీరు మాజీ మైసూరు దివాను సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు (89 సం॥ల వయస్సుగల పారిశ్రామిక ప్రవీణుడు) పై చెప్పిన నివేదికను విమర్శించుచూ యిలా అన్నారు. అన్ని పరిశ్రమలకు తల్లియైన ఉక్కు పరిశ్రమ మన దేశములో మున్ముందుగా వృద్ధిపొందవలెను. ఇప్పటికంటె ఇంకా ఎక్కువ ఉక్కును అనగా సాలుకు 50 లక్షల టన్నుల ఉక్కును ఉత్పత్తి చేయవలెను...

### నిజాం పంచదార ఫ్యాక్టరీ

#### త్వరలో సంస్థాన ప్రభుత్వ స్వాధీనం

హైదరాబాద్, ఏప్రిల్ 18: (ప్రస్తుతం హైదరాబాద్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ మేనేజిమెంటుకింద వున్న, బోధన్ సమీపంలోని నిజాం పంచదార ఫ్యాక్టరీని, సంస్థానప్రభుత్వం త్వరలో స్వాధీనం చేసుకోబోతోందని తెలుస్తోంది. కొంతకాలంకిందట సింగరేణికాలరీస్ మేనేజిమెంటును హైదరాబాద్ ప్రభుత్వం స్వాధీనం చేసుకొంది.

# నల్గొండ వరంగల్లు జిల్లాల్లో కమ్యూనిస్టు అశాంతి

### మధ్యవర్తిసంఘప్రతిపాదనలకు భారతప్రభుత్వసమాధానం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: కాశ్మీర్ మధ్యవర్తిసంఘం ప్రతిపాదించిన సంధి షరతులకు ఇండియా జవాబును...

### "సింహళానికి భారతదేశభయం ఏమాత్రమూ లేదు"

#### తొలిరోజు వార్తపై సేనానాయకే సవరణ

కరాచీ, ఏప్రిలు 18: కాలక్రమమున ఇండియా సింహళాన్ని ఆక్రమించవచ్చునని నిన్న ప్రకటించబడిన వార్తను ఖండిస్తూ, సింహళప్రధాని సేనానాయకే సింహళానికి ఇండియానుండి ఏట్టిభయమూ లేదనీ, సింహళం పట్ల నెహ్రూకుగల స్నేహభావంపరించి తనకు పరిపూర్ణ విశ్వాసం కలదనీ, ఇండియా పాకిస్తాను సింహళాలు పరస్పరాధారం కలవనీ, ఆర్థిక రక్షణ విధానాలను అవి ఉమ్మడిగా నెరపాలనీ చెప్పాడు.

### చంద్రశేఖర్ "ఆజాద్ తల్లికి భరణం"

గ్వాలియర్, ఏప్రిల్ 18: భారతదేశ స్వాతంత్ర్యమునకై అసువులు అర్పించిన చంద్రశేఖర్ ఆజాద్ అనే సుప్రసిద్ధ విప్లవకారునియొక్క తల్లికి మధ్యభారత సంస్థానకూటమి ప్రధానమంత్రి లీలాధర జోషీగారు నెలకు 25 రూ. చొప్పున జీవితాంతమూ భరణము ఇవ్వవలెనని ఉత్తర్వు చేసిరి. చంద్రశేఖరఆజాద్ తల్లి వయస్సు 75 సంవత్సరములు. భారత ప్రధాని పండిట్ నెహ్రూ ఆజాద్ తల్లికి ఇటీవలనే 250 రూ. పంపెను.

# కమ్యూనిస్టుల కొత్త ప్రతిపాదనలపై కుమింటాంగు నాయకుల చర్చలు

## యాంగ్సీనదిని దాటాలని మావ్‌సీటుంగు వర్గం పట్టుబడితే సంప్రతింపులు విఫలం కావచ్చు

నాన్కింగు, ఏప్రిలు 19: చైనాప్రభుత్వ పక్షమైన కోమింటాంగు పార్టీయొక్క నాయకులు నేడు కమ్యూనిస్టులు పంపిన సంధి పత్రాన్ని చర్చించారు. దీన్ని ఆమోదించడానికి వీరికి 24 గంటలు మాత్రమే గడువు మిగిలివుంది.

యాంగ్సీనది దాటివచ్చి సేనల పునర్నిర్మాణం చేయడానికి కమ్యూనిస్టులు కోరిన అనుమతికూడా నిబంధనలలో ఒకటి. ఈ నిబంధన ఆమోదించబడి తీరాలని కమ్యూనిస్టులు పట్టుపట్టితే సంధి సమాలోచనలు విఫలమవుతవనీ, ప్రభుత్వపక్షంవారు కొన్ని రాజీ షరతులు ఆమోదించరనీ ఒక ప్రభుత్వ ప్రతినిధి అన్నాడు.

రేపటిలోగా సంధిపత్రం ఆమోదించాలనే నిర్బంధాన్ని సడలించమని కోమింటాంగు నాయకులు కమ్యూనిస్టులను కోరవచ్చునట.

చైనా అధ్యక్షుడూ, ప్రభుత్వ నాయకులూ ... చేసి కమ్యూనిస్టులకు అందజేస్తారని తెలుస్తున్నది. ప్రభుత్వవర్గం వారు ఏ సమాధాను ఇవ్వకుండానే గడువుకాలం దాటిపోనివ్వవచ్చు ననికూడా కొందరు భావిస్తున్నారు.

అయితే, యాంగ్సీనది ఉత్తరతీరాన గల ప్రభుత్వస్థావరాలపై దాడిచేయడానికి కమ్యూనిస్టులు చేసే విపుల సన్నాహాలు చూస్తే, తమ నిబంధనలకు ప్రభుత్వవర్గం ఆమోదించినట్లయితే వారు బలాత్కారంగా నదిని దాటుతారనే భయం కలుగుతుంది.

### అ. భా. సంపాదకమహాసభ అధ్యక్షపదవిపోటీ

#### ఎ. డి. మణి విరమణ

నాగపూర్, ఏప్రిల్ 18: అఖిలభారత పత్రికా సంపాదకుల మహాసభ అధ్యక్షపదవి పోటీనుండి 'హితవాద' పత్రిక సంపాదకుడు ఎ. డి. మణి, 'స్వదేశమిత్రన్' సంపాదకుడు సి. ఆర్. శ్రీనివాసన్ అభ్యర్థిత్వాన్ని బలపరుస్తూ తాను విరమించుకొనెను. ఈవిషయాన్ని మహాసభ కార్యదర్శికి తంతిద్వారా తెలియజేసెను.

### రేడియో కార్యక్రమాలు

#### వార్తల వేళలు, మీటర్లు

ఆలిండియా రేడియోనుంచి రోజూ ఉదయం 7-0 గం. కు మధ్యాహ్నం 1-50 గం. కు సాయంకాలం 7-0 గం. కు తెలుగులోనూ, ఉదయం 8-0 గం. కు మధ్యాహ్నం 1-30 గం. కు సాయంకాలం 6-0 గం. కు రాత్రి 9-0 గం. కు ఇంగ్లీషులోనూ వార్తలు, ప్రసారం చేస్తారు. ఈ వార్తలను 211.3, 31 28,3 57.1 మీటర్లలో వినవచ్చు.

ప్రతిరోజూ ఉదయం 8-15 మధ్యాహ్నం 1-40కి మదరాసు (1) లోనూ, మధ్యాహ్నం 2-45 మదరాసు (2) లోనూ, సాయంత్రం 7-30 విజయవాడలోనూ ఫిలింపాటలు మొదలైనవి ప్రసారంచేస్తారు.

#### సంగీతాది కాలక్షేపాలూ, ప్రసంగాలూ మొదలైనవి

ఏప్రిల్ 20-వ తేదీ

మదరాసు (1)

...

# 'తొందరపడి అసంపూర్ణరాష్ట్రం అంగీకరించరాదు'

## నాయకత్రయ నివేదికపై రాజమహేంద్రవరం సభలో ప్రముఖుల ప్రసంగాలు

### (స్వకీయ విలేఖరి)

రాజమహేంద్రవరం, ఏప్రిల్ 15: ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయమై అగ్రనాయకత్రయ నివేదికను చర్చించు నిమిత్తము నిన్న నిచ్చట శ్రీ కప్పగంతుల సుబ్బారావుగారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగెను. బోడపాటి శివరామ కవిగారు మాట్లాడుచూ ఆంధ్రనాయకులలో సమైక్యత లేకపోవుటవల్ల యీ అనర్థకమువచ్చి...

...మున్సుగు నాయకులు మంచివారు కనుకను వారికి ప్రజలకు సంబంధము పోలేదు కనుకను మన కోరికలను మరింత తీవ్రముగా వారికి మనవిజేయుట మంచిదని తెల్పిరి. ఆంధ్రజాతి ఎప్పుడూ కాంగ్రెస్ సంస్థనే నమ్ముకొన్నదని కాంగ్రెస్ అగ్రనాయకులు ఆంధ్రుల చిరకాల వాంఛ...

### నిజాం నవాబుకు సాహెబ్ జాదాల విన్నపం

### హైద్రాబాద్‌కు కృపలానీ రాక

### గాంధిస్మారక నిధి

హైదరాబాద్‌లో ఏప్రిల్ 15 నాటికి గాంధి స్మారకనిధికి మొత్తం 15 లక్షలు వసూలుచేయబడింది. ప్రజలు యింకా విరివిగా విరాళాలివ్వవలసిందిగా హైదరాబాద్ శాఖ నిధి కార్యదర్శి విజ్ఞప్తి చేశారు.

### కాశ్మీర్‌లో కొత్తరోడ్లు

...ఇండియాలో ఏకైకమార్గంగా ఉన్న జమ్మూ, శ్రీనగర్ రోడ్డును వెడల్పు చేయటానికి 18 వేలమంది కూలీలు పనిచేస్తున్నారు. సంస్థానంలోని ముఖ్యపట్టణాలను కలుపుతూ రోడ్లువేయాలని ప్రభుత్వం సంకల్పించినది.

# బెర్లిన్ దిగ్బంధన త్వరలో పరిష్కారమయ్యే సూచన

బెర్లిన్, ఏప్రిల్ 18: ఒక ప్రధాన సోవియట్ ఉద్యోగి సాధారణ పౌరుడి దుస్తులలో నిన్న వాషింగ్టన్‌లోని సోవియట్ రాయబారితో ఒక ప్రధాన విషయముపై చర్చించుటకు బయలుదేరి వెళ్ళినని విశ్వసనీయవర్గాలవల్ల తెలుస్తున్నది. బెర్లిన్‌లోని పశ్చిమరాజ్యాల ప్రాంతాల ఆర్థిక దిగ్బంధనం జరిపిన సోవియట్ అధికారి మార్షల్ సొకొలోవిస్కీకి ఆర్థికసలహాదారుగాఉన్న జనరల్ మాలినిన్ అనే ఆర్థిక నిపుణుడే ఈఉద్యోగి అని నమ్మబడుతున్నది. అట్లాంటిక్ ఒడంబడిక వివరాలను, పశ్చిమ యూరపులో...

### పశ్చిమ యూరపు సైన్య విన్యాసం

లండన్, ఏప్రిల్ 18: ఈ వేసవిలో బ్రిటన్, ఫ్రాన్స్, హాలండ్, బెల్జియం, లక్జెంబర్గుల సేనలన్నీ కలిసి సమష్టిగా పెద్ద ఎత్తున విన్యాసాలు జరుపుతవని నేడిక్కడ ప్రచారమవుతున్న వార్తలను బట్టి తెలుస్తున్నది.

### భారతప్రభుత్వ నౌకాయానశాఖ ఏర్పాటు

# 'స్పెయిన్ ఉత్తరాఫ్రికాలు ప్రధాన యుద్ధస్థావరాలు'

## హైదరాబాదు సంస్థానం

### భాషాప్రయుక్తంగా విభజింప వలసిన ఆవశ్యకత

నిమ్నజాతి నాయకుడు సుబ్బయ్యగారి ఉద్ఘాటన

సికిందరాబాదు, ఏప్రిల్ 15: హైదరాబాదు సంస్థానమును వెంటనే భాషాప్రయుక్తముగా విభజింపవలెనని శ్రీ జి. హెచ్. సుబ్బయ్యగారు నిన్న రాత్రి సంస్థాన నిమ్నజాతి ఫెడరేషను ఆధ్వర్యమున జరిగిన డాక్టరు అంబేద్కరు జన్మదినోత్సవ సభలో ఉపన్యసించుచూ ఉద్ఘాటించిరి. ఇస్లామియా మైదానమందు యేర్పరుపబడిన ఈ బహిరంగసభకు దాదాపు పదివేలమంది స్త్రీ పురుషులు విచ్చేసిరి.

సుబ్బయ్యగారు ఆంధ్రరాష్ట్రం విషయమై ఇట్లనిరి. ఈ మధ్య కాంగ్రెసు అధిష్ఠానవర్గము చేనియమితమయిన ఉపసంఘము వారు తయారు చేసిన నివేదిక ప్రకారము త్వరలో ఆంధ్రరాష్ట్రము యేదో ఒకవిధముగ యేర్పడునని ఊహింప వీలగుచున్నది. అయితే తెలంగాణములేని ఆంధ్రరాష్ట్రము పరిపూర్ణము కాజాలదు. ఆంధ్రరాష్ట్రము యేర్పడు పక్షములో హైదరాబాదు సంస్థానమును వెంటనే విభజించి తెలంగాణమును దానిలో సమ్మేళనము చేయవలెను. కొందరు నాయకులు యీవిషయములో తటస్థభావమును మౌనమును వహించుచున్నారు. ఇది సహింపరానిది. ఇందుకొరకు నిమ్నజాతి ఫెడరేషను ఆందోళన చేయగలదు. చెన్నపట్టణము తెలుగువారు పోగొట్టుకున్నంత మాత్రమున విచారింపరాదు. హైదరాబాదు విశాలాంధ్రకు కేంద్రనగరము కాగలదు.

సంస్థాన పరిస్థితులనుగురించి ప్రసంగించుచూ సుబ్బయ్యగారిట్లనిరి: రోజురోజుకు పరిస్థితులు విషమించుచున్నవి. ప్రజా విశ్వాసమునకు పాత్రులయిన ప్రతినిధులచే తాత్కాలిక ప్రభుత్వము వెంటనే ఏర్పడవలెను, మిలిటరీ ప్రభుత్వము సాధించిన దేదో సాధించినది. ఇకపయి ప్రజాప్రతినిధులే సంస్థానమును నేడు యెదుర్కొను తీవ్ర సమస్యలను పరిష్కరించవలెను."

మనోహర్, ముకుందరావు, కృష్ణకుమార్ మాసె, ప్రహ్లాదరావు సర్వదే, మాద్రి గోవిందరాజులు గారలు కూడా మాట్లాడిన తరువాత నిమ్నజాతి మహాసభ కార్యదర్శి మనోహర్ వందనములతో సభ ముగిసెను.

## 'షుగర్ రిఫైనరీస్' బిల్లు సెలెక్టుకమిటీ సంచారం

విశాఖపట్టణము, ఏప్రిల్ 16: మంత్రి మాధవమీనన్, "షుగర్ రిఫైనరీస్ బిల్లు" సెలక్టుకమిటీ సభ్యులూ, కమిటీ కార్యదర్శి కే. జే. మీనన్‌గార్లు నిన్నను, సీతానగరము, బొబ్బిలి పంచదార మిల్లులను సందర్శించి చెరుకుపంటలు పండించు రైతులనూ, వారి తరఫున అనేకమంది పెద్దలనూ విచారించి శాసనసభలో బిల్లు ప్రవేశపెట్టుటకు ముందు కావలసిన విషయములను సేకరించిరి

మాధవమీనన్‌గారు, విజయనగరం సబ్ జెయిలునూ, విశాఖపట్టణం జిల్లా జెయిలునూ తనిఖీచేసి, నిన్న సాయంత్రము వుయ్యూరు పంచదార ఫ్యాక్టరీ చూచుటకు విజయవాడ వెళ్లిరి. (స్వ. వి.)

## కాంగ్రెస్ కార్యకర్తల సమావేశం

విజయవాడ, ఏప్రిల్ 16: కాంగ్రెస్, కిసాన్ కాంగ్రెస్ ఇత్యాది సంఘముల కార్యకర్తల సమావేశం ఒకటి ఈనెల 25 మధ్యాహ్నం 11గం. కు ఆంధ్రరత్న భవనంలో జరుగుతుందనీ, ఎన్. జి. రంగాగారు ఉపన్యసించెదరనీ రాష్ట్రకాంగ్రెస్ కార్యాలయ కార్యదర్శి వ్రాశాడు. దరిమిలాను రంగాగారు ఆయా జిల్లాల కార్యకర్తలను విడివిడిగా కలుసుకొని, ఆయా జిల్లాల వ్యవహారాలు చర్చించి, వివిధ సమస్యల పరిష్కారానికి సలహాలిస్తారట.

### చెన్నరాష్ట్ర చేనేత సహకార సంఘాల ప్రతినిధుల సభ

నిడుబ్రోలు, ఏప్రిల్ 15: చెన్నరాష్ట్ర చేనేత సహకారసంఘ సర్వసభ్య సమావేశ సందర్భములో ఈనెల 24న చెన్నపట్నం చాకలిపేటలోని త్యాగరాయ శెట్టి హైస్కూలులో చెన్నరాష్ట్ర చేనేత సహకారసంఘముల ప్రతినిధుల సభ జరుగుతుందనీ, ప్రతినిధులు 23వ తేదీ నుండి 25వ తేదీవరకు వుండుటకు వీలుగా ఆ హైస్కూలు భవనములో బసలు ఏర్పాటు చేయబడెననీ ప్రగడ కోటయ్యగారు వ్రాశారు.

### నిడదవోలు హైస్కూలు భవననిధి

నిడదవోలు, ఏప్రిల్, 15: స్థానిక హైస్కూలు భవననిర్మాణనిధికి స్థానిక శ్రీ కొవిశ్వేశ్వర కోటేశ్వర రైసు మిల్లువారు రూ 1000/- లు విరాళ మొసంగిరి.

## కార్మిక నివాస గృహముల నిర్మాణమునకు కొత్తస్కీము

### 10 ఏళ్ళలో 10 లక్షల ఇళ్ళను కట్టుటకై తక్షణమే పనిప్రారంభం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: కార్మికులకు నివాసగృహములను నిర్మించుటకై భారత ప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వములకు ఒక క్రొత్త స్కీమును పంపించినట్లు తెలియుచున్నది.

10 సం.త్సరాలలో 10 లక్షల యిండ్లు నిర్మించ గలందులకై ఈ స్కీము వెంటనే ప్రారంభం కావలెనని కేంద్ర ప్రభుత్వము ఆతురత చెందుచున్నది. ఒక్కొక్క యింటికి 240 చ. అడుగుల విస్తీర్ణంలో 2 గదులు, వేరే ఒక వంటగది, ఒక స్నానపుగది, మరుగుదొడ్డి, వరండా, ఒక ఖాళీ స్థలము ఉండును. ఒక్కొక్క యింటికి బొంబాయి, కలకత్తాల లో 4,500 రూ ఖర్చగును. 35 ఏళ్ల వరకూ ఈ యిల్లు చెక్కు చెదరవు.

వీని నిర్మాణమున కయ్యే పెట్టుబడిలో మూడింట రెండువంతులను కేంద్రప్రభుత్వము, 1 వంతును రాష్ట్రప్రభుత్వము గాని, పారిశ్రామిక యజమానిగాని భరింతురు. రాష్ట్రప్రభుత్వముల కీవిషయంలో కేంద్రము ధనసహాయ మేమీ చేయదు కేంద్రము ఇచ్చెడి పెట్టుబడిపై వడ్డీతీసుకొబడదు. కాని రాష్ట్రప్రభుత్వములు ఒక సింకింగ్ ఫండును స్థాపించి, కేంద్రమునకు ఋణమును తిరిగి చెల్లించిన తరువాతి పదేళ్ళలోగా ఆఫండుకు తమతమవాటాలను ఇచ్చుట ప్రారంభింపవలెను.

మొత్తం పెట్టుబడిఖర్చులలో నూటికి మూడువంతులకు మించకుండా పారిశ్రామికులు సింకింగ్ ఫండుకు తమవాటాల నిచ్చెదరు. కార్మికులు తమజీతములో నూటికి 20 వంతులభాగమును (పెట్టుబడిఖర్చులలో నూటికి 2½వంతులు) తమవాటాగా ఇచ్చెదరు. కాని ఈ అద్దె రవేళ్ళవరకే అమలులో ఉండి, ఆతరువాత తిరిగి ప్రభుత్వముచే ఆలోచించబడును. రాష్ట్రప్రభుత్వములు మిగతాభాగమును భరించును.

పెట్టుబడి ఖర్చులలో కేంద్రము భరించెడిది నూటికి 2వంతులు.

## బ్రిటన్‌కు బర్మా ఋణ దరఖాస్తు

న్యూఢిల్లీ ఏప్రిల్ 17: బర్మా బ్రిటనును పదమూడుకోట్ల రూపాయలకు మించిన మొత్తాన్ని ఋణంగా ఈయవలసినదని కోరినట్లు తెలుస్తున్నది.

ఈ అభ్యర్థన బ్రిటిష్ ఆహారమంత్రి శాఖకు చేయబడింది. ఈ సొమ్ము బర్మా నుంచి జరిగే బియ్యపు ఎగుమతులకు వినియోగించబడుతుంది.

బ్రిటన్ బర్మాకు ఈ ఋణాన్నీయడానికి అంగీకరించినట్లయితే బర్మానుండి బియ్యాన్ని దిగుమతి చేసుకుంటూన్న భారత, పాకిస్తానులు తమువంతును ఈయవలసి యుంటుంది. —గ్లోబ్.

## చారిత్రక గ్రంథాల సవరణ

### పాకిస్థాన్ ప్రభుత్వంచే ఐతిహాసికసంఘనియామకం

కరాచి, ఏప్రిల్ 17: భారతఖండపు వ్యవహారాలకు సంబంధించినంతవరకు ఇతిహాస గ్రంథాలను తిరిగి వ్రాయడానికై డొమినియన్‌లోని ప్రముఖ చరిత్రకారులను నియమించడానికి పాకిస్తాన్ ఇతిహాస సంఘం నిశ్చయించినదని తెలుస్తున్నది.

ప్రస్తుత మున్న చరిత్ర గ్రంథాలలో వాస్తవ విషయాలకన్న కల్పన అధికమనీ, ముఖ్యంగా భారతంలో ముస్లిముల పరిపాలన తప్పుగా వ్రాయబడినదనీ ఈసంఘం తలుస్తున్నది. ఇందుకై శాశ్వతంగా ఒక పరిశోధన వ్యవస్థను నిర్మాణంచేసే విషయంకూడ పరిశీలించబడుతోంది.

ఈలోగా విద్యాలయాలలోనూ, కళాశాలలలోనూ పాఠ్యపుస్తకాలుగా ఉపయోగింపబడడానికి ఇతిహాససంఘం కొన్ని గ్రంథాలను సూచించింది. వాటినే ఉపయోగించవలసిన దని కేంద్ర, రాష్ట్రాల విద్యాధికారులకు సూచనలు జరిగాయి. —గ్లోబ్.

## సర్ బెర్నార్డుపార్స్ మృతి

న్యూయార్కు, ఏప్రిల్ 17: రష్యా చరిత్రలోను, నాగరికతలోను పెక్కు పరిశోధనలు జరిపి ఖ్యాతి వహించిన సర్ బెర్నార్డు పార్స్ నేడు తన 82వ ఏట యిచ్చటి ఆస్పత్రిలో కాలధర్మము చెందెను. లివర్పూల్, లండను విశ్వవిద్యాలయాలలో యితను రష్యన్ చరిత్ర, భాష, సారస్వతాచార్యుడుగా చాల ఏండ్లు పనిచేసి రష్యన్ భాషలో పెక్కు గ్రంథములు రచించెను.

## అ. భా. హిందూమహాసభ కార్యవర్గ సమావేశము

### మే 7, 8 తేదీలలో ఢిల్లీలో జరుగును

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: అఖిలభారత హిందూమహాసభా కార్యవర్గ సమావేశం మే 7, 8 తేదీలలో ఢిల్లీలో జరుపుటకు యేర్పాటైంది. ఈ సమావేశంలో క్రిందటిసారి మహాసభ కమిటీచే ఆమోదింపబడకుండా నిలచిపోయిన కార్యక్రమాన్ని ఆమోదించడం మహాసభను పునరుజ్జీవింపచేయడం, మున్నగు విషయాలపై చర్చ జరుగుతుంది.

## కట్జూగారికి "విద్యాలంకర్" బిరుదు

శాంతిపూర్, (ప. బెంగాల్) ఏప్రిల్ 17: వంగీయ పురాణ పరిషత్తువారి నలుబదియవ వార్షికస్నాతక సమావేశములో పశ్చిమ బెంగాల్ గవర్నరు కే. ఎన్. కట్జూగారికి "విద్యాలంకార్" అను బిరుదు నేడు ఇవ్వబడినది. ఈ పరిషత్తు సుప్రసిద్ధ సంస్కృత పండితుల సంఘము.

నేటి స్నాతక సందర్భంలో 600 మంది విద్యార్థులకు డిప్లొమాలు ఇవ్వబడెను. అధ్యక్షత వహించిన చిన్నస్వామి శాస్త్రిగారు, ఉపన్యసించుచు సంస్కృత భాష పూర్వకాలమునుండి ఇప్పటివరకూ, భారత రాష్ట్రములకు ఐక్యత నాపాదించెడి సూత్రబంధముగా ఉంటున్నదనీ, సంస్కృతము స్వతంత్ర భారతములో ఇంగ్లీషు స్థానము నాక్రమించుకొవలసి యున్నదనీ చెప్పిరి.

సంస్కృతము భారత జాతీయభాషగా తయారగుటకు పదేండ్ల పథకము నొకదానిని కలకత్తా యూనివర్సిటీకి చెందిన డా॥ బి. చౌదరి సభ్యులకు వివరించిరి.

## మలయాలో సైనికులకు స్థావరములు

లండన్, ఏప్రిల్ 17: మలయాలోనూ సింగపూరులోను 10 వేలమంది బ్రిటిష్ సైనికులకు 5 వేలమంది వైమానికులకు స్థావరములు ఏర్పాటుచేయబడుచున్నవి.

మలయాలో ఉన్న సైనిక బలగమును బ్రిటన్ ప్రస్తుతం తగ్గించదలచుకొనలేదని తెలియుచున్నది.

అమలాపురం తాలూకా ముమ్మిడివరం గ్రామం బాలయోగి. ఇతనిని గురించిన వివరములు ఈనెల 18-వ తేదీ 'ఆంధ్రపత్రిక'లో ప్రచురితమైనాయి.

## రాజకీయరంగంనుండి జమయత్ నిష్క్రమణ

లక్నో, ఏప్రిల్ 18: జమయత్ ఉల్ ఉలేమా హింద్ రాజకీయ వ్యవహారాలనో పూర్తిగాసంబంధంవదులుకొని, యికనుంచి భారతీయ ముస్లిం ప్రజాబాహుళ్యం యొక్క మతసాంస్కృతిక అభ్యుదయానికి కృషిచేయ నిశ్చయించుకొన్నది. ప్రధాన కార్యదర్శి మౌలానా హిఫ్జ్ ఉర్ రహమాన్ యీఉదయం జమయత్ విధానాన్ని నిర్దేశిస్తు ప్రతిపాదించిన తీర్మానాన్ని మహాసభ ఆమోదించినది.

## ముస్లింలీగ్‌లో ముసలం!

కరాచీ, ఏప్రిల్ 17: ముస్లింలీగ్ సభ్యులలో అసంతృప్తి హెచ్చుచున్నది. ప్రముఖసభ్యులనేకులు దానినుండి రాజీనామా నిచ్చిరి. లీగ్ కార్యవర్గంనుండి రాజీనామా నిచ్చిన షబ్బీర్ అహ్మద్ ఉస్మాని ముస్లింలీగ్ ప్రస్తుత నిర్మాణం ప్రజాసామాన్యమునకు అందుబాటులో లేదని విమర్శించెను. ఇట్టి విమర్శలకుభయపడి లీగ్ కార్యవర్గం ఆర్థిక సమస్యలపై తనదృష్టిని తరలించుటకు నిశ్చయించినది.

## పాట్నాజంక్షన్‌కు 'పాటలీ' పుత్రమను నామకరణ

పాట్నా, ఏప్రిల్ 18: పాట్నా జంక్షనుకు పాటలీ పుత్రమని, పాట్నానగర రైల్వేస్టేషనుకు 'పాట్నా సాహిబ్' అని త్వరలోనే నామకరణం చేయబడునని తెలుస్తున్నది. ఈ విషయమై తూర్పు ఇండియా రైల్వే అధికారులు ఆరు నెలలుగా రైల్వేబోర్డుతో సంప్రదిస్తున్నారని, యిప్పటికి రైల్వేబోర్డువారు అంగీకరించారనికూడా తెలియవచ్చింది.







Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G.T. Madras.